# సంక్రాంతి పుణ్యకాలములు

(సరళ వివరణ:డి.నారాయణ రావు, విద్యానగర్, హైదరాబాద్, తెలంగాణా రాష్ట్రం)

*****

మనకు సంక్రాంతి ఒక పెద్ద పండుగ. దానిని మకర సంక్రాంతి అనీ మకర సంక్రమణ అనీ అంటారు. ఈ రోజు నుండి సూర్యుడు ఉత్తరం వేపు పయనం ప్రారంభిస్తాడు.అందువల్ల ఈ రోజును ఉత్తరాయణ పుణ్యకాలమనీ అంటారు. ఇంతటి ప్రాముఖ్యత లేకున్నా మనకు సంక్రాంతులు ఇంకా 11 ఉన్నాయి. రాసులు 12 ఉన్నట్లే సంక్రాంతులు కూడా 12 ఉంటాయి. సంక్రాంతి లేదా సంక్రమణ అంటే సూర్యుడు ఒక రాశి నుండి మరొక రాశికి మారడం.సూర్యుడు సుమారుగా ఒక నెలకు ఒక రాశి నుండి మరొక రాశికి మారతాడు. అంటే సంవత్సర కాలంలో 12 రాశులు మారతాడు. ఆ 12 సంక్రాంతుల వివరాలు.

రాశులు చరరాశులు, స్థిరరాశులు మరియు ద్విస్వభావరాశులని మూడు రకాలు. అలాగే సంక్రాంతులలో నాలుగు రకాలు.

చరరాశులైన మేష, తుల రాశులను విషువత్తులంటారు. (Vernal Equinox and Autumnal Equinox). ఈ రాశులందలి సంక్రాంతులను విషువత్ సంక్రాంతులంటారు. ఈ సంక్రాంతుల పుణ్యాకాలాన్ని విషువత్ పుణ్యకాలమంటారు. ఈ విషువత్ సంక్రాంతులలో పగలు మరియు రాత్రి సమానంగా ఉంటాయి.

చరరాశులైన కర్కాటక, మకర రాశులను ఆయన రాశులంటారు.ఈ రాశులందలి సంక్రాంతులను ఆయన సంక్రాంతులంటారు.కర్కాటక సంక్రాంతి దక్షిణాయణ సంక్రాంతి(Summer Solstice) అయితే, మకర సంక్రాంతి ఉత్తరాయణ సంక్రాంతి(Winter Solstice) . కర్కాటక సంక్రాంతి రోజు పగలు పెద్దది రాత్రి చిన్నదైతే, మకర సంక్రాంతి దీనికి వ్యతిరేకం పగలు చిన్నది రాత్రి పెద్దది .

స్థిర రాశులైన వృషభ,సింహ, వృశ్చిక మరియు కుంభ రాశులను హరిపదములు లేదా విష్ణుపదములు అంటారు.

ద్విస్వభావ రాశులైన మిథున, కన్యా, ధనుస్సు మరియు మీన రాశులను షడశీతులు అంటారు.

పర్వకాలాల్లో స్నానము, దానము మరియు శ్రాద్ధము చేసినట్లయితే విశేష పుణ్యం లభిస్తుంది. షడశీతులు మరియు విష్ణుపదం పుణ్యకాలాల్లో స్నాన, దాన, శ్రాద్ధాదుల వల్ల 1,000 రెట్లు, విషువత్ పుణ్యకాలాల్లో

10,000 రెట్లు, దక్షిణాయన పుణ్యకాలమందు ఒక కోటి రెట్లు, ఉత్తరాయణ పుణ్యకాలమందు 100 కోట్ల రెట్లు పుణ్యం లభిస్తుందని శాస్త్రవచనం.

1.చర రాశులైన మేష, తుల విషువత్తులందు పుణ్యకాలము ప్రవేశానికి ముందు 10 ఘడియలు (4 గంటలు) మరియు తరువాత 10 ఘడియలు (4 గంటలు)

2.దక్షిణాయణమైన కర్కాటక రాశి ప్రవేశమందు పుణ్యకాలము ప్రవేశానికి పూర్వము 30 ఘడియలు (12 గంటలు)

3.ఉత్తరాయణమైన మకర రాశి ప్రవేశమందు పుణ్యకాలము ప్రవేశం తరువాత 40 ఘడియలు (16 గంటలు ),హేమాద్రి మతం; 20 ఘడియలు (8 గంటలు), మాధవ మతం

4.స్థిర రాశులైన వృషభ, సింహ, వృశ్చిక, కుంభ విష్ణుపదము(హరిపదము)లందు ప్రవేశానికి పూర్వము 16 ఘడియలు ( 6 గంటల 24 నిమిషాలు)

5.ద్విస్వభావ రాశులైన మిథున, కన్యా, ధనుస్సు, మీన షడశీతులందు ప్రవేశం తరువాత 16 ఘడియలు ( 6 గంటల 24 నిమిషాలు)

ఈ రోజుల్లో కొన్ని విషయాల్లో అభిప్రాయభేదాలున్నట్లే పూర్వం కూడా సంక్రమణ కాలం ప్రభాతకాలమైతే, ఉదయానంతరమైతే, మధ్యాహ్నమైతే, సాయంకాలమైతే, రాత్రికాలమైతే, అర్ధరాత్రి ఐతే ఇలా విభిన్న సమయాల్లో జరిగితే పుణ్యకాలం ఎలా పాటించాలి అనే విషయంలో భిన్నాభిప్రాయాలున్నాయి. అవన్నీ కూడా ధర్మసిందు, నిర్ణయసింధు, ధర్మప్రవృత్తి, పురుషార్థచింతామణి, స్మృతికౌస్తుభం మొదలైన ధర్మశాస్త్ర గ్రంథాల్లో చర్చించబడి ఉన్నాయి .

